విడిప్రతి ౧కి ౧ అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ 10321 సెప్టెంబరు 26 వ తేది 1935 గురువారము అర్ధ సం॥ చందా రూ. ౩

సంపుటము ౧౦. తూపుబజారు, హైదరాబాదు - దక్కన్. సంచిక ౩౯.

శా. శ. ౧౮౫౭ శ్రీ యువ సం॥ భాద్రపద బ॥ ౧౪ గురువారము. ౨౦ అబాన్ ౧౩౪౪ ఫ.

## ఉస్మానియా విశ్వవిద్యాలయము-ఆంధ్రభాష

కే. వేంకటరామారావు గారు బి. ఏ

గతసంచిక తరువాయి

### బి. ఏ. క్లాసు:—

ఈ విధముగా నొక విద్యార్థి రెండు వత్సరములు ఇంటరు క్లాసులో గడపి,గడతేరి బి.ఏ. క్లాసు చేరును. ఉస్మానియా విశ్వ విద్యాలయ కళాశాల యొకటిమాత్రమే మొదటి గ్రేడు కళాశాల బి.ఏ తరగతులుకళాశాలయందే యున్నది. బి. ఏ. యందుకూడా తెనుగును ఐచ్ఛిక విషయములందు చేర్చినారు. ఇట ఐచ్ఛిక విషయ సమూహమునకు "స్కూలు" యను పదము వాడబడును. ఇంగ్లీషు నిర్బంధ విషయముగాక

Language School
History School
Philosophy School

యను త్రివిధ స్కూలులు గలవు. ఇందు తెలుగు మొదటి స్కూలుకు జెందినది. ఈస్కూలు ననుసరించి సంస్కృతమునకు తెనుగునకు సమానస్థానము కలదు. మార్కులను జట్టిచూచిన రెండును సమానము. ప్రత్యేక తెలుగు స్కూలని కాని సంస్కృత స్కూలని కాని లేదు. ఐచ్ఛిక విషయములకు ఆరువందల మార్కులు. అందు మూడువందలు సంస్కృతమునకు పోగా మిగత మూడువందలు తెనుగునకు నియమితములు. కావున ఈస్కూలుకు సంబంధించిన పట్టభద్రుడు అటు తెలుగు బి. ఏ. కాక, ఇటు సంస్కృత బి. ఏ. కాక, రెంటికి చెందియు, ఎటుచెందనివాడై యుండును.

తెలుగు చెన్నకొని బి. ఏ. లో ఉత్తీర్ణుడగుట కడు సులభము. ఇందొక రహస్య మిమిడియున్నది. అనుభవించిన వారలకుతప్ప ఇతరులకీరహస్యము తెలియదు. ఆరువందల మార్కులు ఐచ్ఛిక విషయములకు నియమితములని పైన చెప్పబడెను. గడతేరుటకు రెండు వందల మార్కులు చాలును. తెలుగుకు సంబంధించిన మూడువందల మార్కులలో బాలురు మాతృభాషయగుటవలన, కనీసము నూటికి ఏబదిపాళ్ళ నూటయేబది మార్కులు గడింతురు. ఇక కావలసినది ఏబదిమార్కులు మాత్రమే. సంస్కృతసంబంధ మూడువందలలో అనాయాసముగా ఏబది సంపాదింపవచ్చును. కావున బాలురు ఇంగ్లీషులో గడతేరితేసరి ఐచ్ఛికవిషయములలో తప్పక గడతేరుదురని నమ్మియుందురు. సంస్కృతము సంపూర్ణముగా త్యజించి పరీక్షయందు ఉత్తీర్ణులగుటకు యాటంకము లేదు. బాలురీరహస్యజ్ఞానము కొన సంస్కృతమునందలశ్రద్ధను వహించెదరు. సంస్కృతలిపి ఆంధ్ర విద్యార్థుల కనుకూలముగా లేదని తెలిసినది. దీనితోడు బి.ఏ. తరగతినే పఠనీయ గ్రంథములు, తద్బోధనా పద్ధతియు [illegible] కారణము, మెట్రిక్యులేషన్ కేమాత్రపు సంస్కృత జ్ఞానము లేక, ఇంటరు రెండు సంవత్సరములలో భండార్కరు మొదటి పుస్తకము, ఒక నాటకము, రఘువంశములోని ఒక సర్గ; భగవద్గీతలో యొక అధ్యాయము పూర్తిచేసి బి. ఏ. కు రాగానే అచటి పఠనీయగ్రంథావళి చూచి చకితుడగును. కారణమేమి? అలంకార శాస్త్రములలోనెల్ల కఠినమగు కావ్య ప్రకాశము, ఋగ్వేదము, తర్కశాస్త్రములాదిని కిల్లు. ఆ మూలాగ్రము కంఠగత మొనర్పవలసి యుండును. సంస్కృతమునందిప్పటికి విశేషజ్ఞానముండు కావున వారాపుస్తకముల నన్వయ మొనర్చుకొను స్థితియుండుదురు. తెలిసియు తెలియని విషయములు, సంపూర్ణముగా తెలియని కొన్నివిషయములు చిన్నతరగతులందు కంఠగత మొనర్చుటకు వీలగునుకాని బి.ఏ.విద్యార్థిలిటులొనర్చుట కసాధ్యము, ఈపద్ధతి వారికి నిరుత్సాహకరము. దీనికి తోడు పరీక్షలో గడతేరు రహస్యము వీరికి గలదు. కావున సంస్కృతము నొకమూలకుత్రోచి ఎటులనో రెండేండ్లుగడపి గట్టెక్కజూచెదరు. ఈకారణములవలన తెలుగుబి.ఏ.లకు సంస్కృతజ్ఞానముండవలసినంత లేదనియు, పట్టము పొందిన తర్వాత నేర్చిన అల్ప సంస్కృతము కూడా మరచిపోవు స్థితి తటస్థించుచున్నదని యొప్పుకొనవలసి యుండును. సంస్కృతమునందు తగు శ్రద్ధ లేకపోవుటచేతనే తెలుగు బి. ఏ. లలో ఒకరిద్దరుతప్ప మిగతవారందరు మూడవతరగతియందు ఉత్తీర్ణులైనారు. అధునికాలమున పోటీలకాలము. పదములకై, తరగతులకై ప్రాకులాడు కాలమున శక్తులయ్యు మూడవతరగతియందు తీర్ణులైనవారలకు యుత్సాహనాశన మగునని వేరుగ చెప్పనవసరము లేదు.

పైవివరింపబడిన క్లిష్టపరిస్థితులు చెల్లాచెదరైపోవుటకొక మార్గమున్నది. అదేదనః— సంస్కృతాంధ్రములలో ఒకటి ప్రధమము లేక ముఖ్యవిషయము (Main) రెండవది తత్సంబంధ విషయము (Subsidiary) చేయవలయును. ఎటులన తెలుగు ముఖ్యవిషయము (Main Subject) సంస్కృతము (Subsidiary) తత్సంబంధవిషయము చేయబడెనని తలచుడు. మార్కుల విభజన నాలుగువందలు తెలుగునకును, రెండువందలు సంస్కృతమునకును ఉండును. ఇట్లు బి. ఏ. లో ఉత్తీర్ణులైనవారలు తెలుగు బి. ఏ. అనబడుదురు. రెంటియందును శ్రేష్ఠులుగా ప్యాసగుట నిర్బంధము కావున బాలురు సంస్కృతవిషయమై ప్రత్యేకముగా కష్టపడి బి. ఏ. కు జ్ఞానోపార్జన మొనరింతురు. సంస్కృతమేమియు [illegible] భారినుండి తొలగిపోవును. ఇదేవిధముగా సంస్కృతమువందేష్టులై [illegible] నినే ప్రధమభాషగా ఎన్నుకొనవచ్చును. విద్యార్థి ముందుగు పరీక్షలందు ననుసరింపబడు పద్ధతులు బి. ఏ. విషయమై యనుసరించిన లాభదాయకము.

దీనితోపాటు పఠనీయగ్రంథములయందు కూడా మార్పు అవసరము. దిఙ్జ్ఞానము వృద్ధిచేయజాలునవియు, సామాన్యజీవితమునందుపయోగకరమగు సంస్కృతిజ్ఞాన ముపార్జింపచేయునట్టియు గ్రంథము లేర్పరచిన [illegible] కృతితోత్సాహముతో వానియధ్యయన మొనరించవచ్చును. ఉదాహరణముగా ఋగ్వేదమునకు బదులు ఇతిహాసములు నాటకములు లేక [illegible] గ్రంథము లుండిన బాగుండును.

ఇటులనే బోధనాపద్ధతియందును మార్పు అవసరము. కేవలము పూర్వ పద్ధతుల ననుసరించక, అధునిక పద్ధతుల పై సంస్కృతము నేర్పబడవలెను. కావ్యప్రకాశమునంతయు కంఠగతము చేయవలయునని నిర్బంధించక దానియంశములు తెలిసికొనునట్లు చేయవలెను. ఇట్టిచిన్న సవరణలచే అత్యధిక లాభము పొందవచ్చును.

తెలుగునకు ఒకభాషావర్గము లోనే (LanguageSchoolలోనే)గాక చరిత్రములో (h.story Schoolలో)కూడ స్థానమిచ్చిన భాష కంతయు లాభము కలదు. ఎటులన:— తెలుగు, దానితోపాటు హిందూదేశచరిత్ర ప్రత్యేకించి ఆంధ్రచరిత్ర— ఈరెంటినికలిపి ఒక సంయుక్త వర్గము (Combination) ఏర్పరచిన, రెండువిషయములందు పరిశ్రమచేయుట కనుకూలతయుండును. ఆంధ్రమునకు ఆంధ్రదేశచరిత్రకు అవినాభావ సంబంధము. పురాణ, కావ్యాది ఆంధ్రగ్రంథములందు యాంధ్రదేశ చరిత్రాత్మకవిషయము లెన్నియో గుప్తములు. ఈరెంటిని ఒకేతూరి బి. ఏ.లో చదువు నేర్పాటున్న క్రొత్తవిషయములు పెక్కులు బయలుపడునని ఖండితముగా చెప్పవచ్చును.

### బి. ఏ. తరువాత

ఇంతటితో తెనుగునకుఉస్మానియావిశ్వవిద్యాలయమునందున్న స్థానము పరిసమాప్తినొందును. ఎం. ఏ. క్లాసులు లేవు. కాని ఎం. ఏ. క్లాసులు అవసరమా? యను నొక ప్రశ్న. కొన్ని విషయముల ననుసరించిచూచిన నవసరమేయని నిశ్చయింపవచ్చును. బి. ఏ. క్లాసులోనే 3–4 కన్న ఎక్కువ విద్యార్థులు లేనప్పుడు ఎం.ఏ. లోనుండువారెవరని యొకచిన్న సందేహము గలిగిన నుండవచ్చును. క్లాసుల యేర్పాటుల పూర్వమే ఈసందేహ మనవసరము. క్లాసులున్నప్పుడు యభిరుచికలవారెవరైన చేరకపోరు. బి. ఏ. తరువాత యున్నత విద్యలకు ఈకళాశాలయందుకాని . ఇతరవిశ్వవిద్యాలయములయందుకాని వీలులేదు. మరాఠీ, కన్నడము, సంస్కృతముల విషయమై ఇటులకాదు. మరాఠీ కొరకు నాగపూరు, కన్నడమునకు మైసూరు సంస్కృతమునకు కలకత్తా మున్నగుప్రదేశముల కేగియున్నతపట్టముల సంపాదించుటయనుకూలత కలదు. తెలుగువిషయంలో ఇట్టివీలుబాటులేదా? మద్రాసు. ఆంధ్ర విశ్వ విద్యాలయము లీఉస్మానియాను పూరకించవు. ఈ కళాశాలయందు ఎం. ఏ. తరగతులున్న నష్టము మాత్రము లేదని సాధింప చెప్పవచ్చును. మన దేశభాషలు, సంస్కృతముతప్ప, చరిత్ర, వేదాంతము, గణితము, ఉర్దూ, పారసీకము, అరబీ మున్నగువాని ఎం. ఏ. తరగతుల ఏర్పాటులున్నవి. వీనియందు విద్యార్థులసంఖ్య యల్పమేకాని ఈనిమిత్తమే తరగతులు తీసివేయబడలేదు. వేదాంతము ఎం. ఏ క్లాసొక యుదాహరణము దీనియందొకరిద్దరికన్న ఎక్కువ విద్యార్థులుండరు. కొన్ని సంవత్సరము లెవరును యుండరు. అయినను ఏర్పాటు యున్నది. అభిరుచి కలవారికి యనుకూలతయున్నది. ఇట్టి యనుకూలతయే ఆంధ్రమునకున్న నష్టమేమి?

ఎం. ఏ. పరీక్ష యేర్పాటులున్న, యింతవరకు బి. ఏ. లయి ఉద్యోగులయినవారలు ప్రైవేటుగా నీ పరీక్ష నిచ్చుటకు వీలుండును. ఇతర విషయములనెన్నికొని ఎం. ఏ లయినవారికిని తెలుగు ఎం. ఏ. డిగ్రీ పొందుటకు వీలుండును. కొట్టి ఇట్లాంటి కొన్ని విషయముల నాలోచించిన ఎం. ఏ. క్లాసు లవసరమని తోచును. ఎం. ఏ. ఏర్పాటులున్న నధ్యాపకులేరీ? యను వచిదొక ప్రశ్న. ఈప్రశ్న మనకు సంబంధించినది కాదు. ప్రభుత్వము తలచిన అధ్యాపకులకు కొదువలేదు.

### రిసర్చిక్లాసు (పరిశోధన తరగతి):—

ఎం. ఏ. లోటును మాపుటకు కాబోలు సుమారు పదేండ్లకు పూర్వం రిసర్చిక్లాసని యొక పరిశోధనశాఖ నేర్పరచిరి. కాని దాని యుద్దేశ్యములు నెరవేరెనని చెప్పసందేహము. ప్రధమ పరిశోధకుడు రెండేండ్లు కష్టించెను. పరిణామమేమో ఎవరికిని తెలియదు. అధికారులుతత్సంబంధీకులు ముమ్మందు దీనిని ఖండింతురేమో! రెండవ పరిశోధకులు కారణాంతరముల చే మధ్యనే తమపదవికి స్వస్తి చెప్పినారు. కారణములు మనకు సంబంధించినవి కావు. వానిని గురించి విపులముగా తెలిసికొన మనకవసరము. కాని వారు చేయగడంగిన భాషా సేవ నిగమించుటచే భాషకొక లోటుకలిగెనని చెప్పవచ్చును. వారిపరిశోధనఫలితములు భాషకు వన్నె తెచ్చెడివిగ నుండెడివేమో! ఆటుతరువాత ఎవరును పరిశోధకులుగ నియమింపబడలేదు. ఇప్పటికి సుమారు మూడువత్సరములు

—౧౧ వ పేజీచూడుడు.

# న్యాయస్థానములలో మాతృభాషల స్థానముయెడ అతృప్తి

## ప్రధానమంత్రికి హైదరాబాదు రాష్ట్ర హిందువుల విజ్ఞప్తి

### హిందువుల కెక్కువ ఉద్యోగములు అవసరము

హైదరాబాదు సంస్థానపు హిందువులు నిజాంప్రభువుగారి ప్రధానమంత్రికి మరియొక విజ్ఞప్తిని సమర్పించుకొనినారు. విజ్ఞప్తిని సమర్పించినవారు ప్రభుత్వమువారికి తాము గత జులై 31వ తేదినాడు అర్పించినవిజ్ఞప్తిని జ్ఞాపకము చేసికొనవలసినదని కోరుచున్నారు. ఈ జులై 31వ తేదినాటి విజ్ఞప్తిలో నిజాంరాష్ట్ర జనసంఖ్యలో హిందువులు నూటికి 85 మంది యున్నను, ప్రభుత్వమువారి చిన్నయుద్యోగములందైననేమి, పెద్ద యుద్యోగములందైన నేమి హిందువులసంఖ్య చాలతక్కువగనున్నదని చెప్పఁబడియుండెను. అంతేగాక ప్రతిశాఖలోను అధమపక్షము నూటికి 50 వంతున నైనను ఉద్యోగపదవులను హిందువులకు ఒసంగవలసినదనియు, రాబోవు 5 యేండ్లలో ఉద్యోగపదవులందు అంతమందిహిందువులుజేరుటకు ఏడాదికి యెంతమంది హిందువులకు ఉద్యోగముల నిచ్చుచుపోవలెనో లెక్కవేసి ప్రోగ్రాము సిద్ధపరచవలయుననియు వారు విన్నవించియుండిరి.

ఇప్పుడు ఆ జులై 31 తేదినాటి విజ్ఞప్తికి అనుబంధముగా వారీక్రిందివిధముగ కోరుచున్నారు:—

న్యాయ విచారణశాఖ (అదాలత్) లో హిందువులు చాల తక్కువమంది. న్యాయ విచారణశాఖకుజెందిన ఉద్యోగపదవులనన్నిటిని మొత్తము చేసి చూచినచో 173 మంది ముసల్మానులకు 17 మంది హిందువులవంతున మాత్రమే గలరు. ప్రతిప్రభుత్వపరిపాలనలోను చాల ముఖ్యమైనశాఖలలో న్యాయవిచారణశాఖ యొకటి. ఏప్రభుత్వముయొక్కగాని కీర్తి ఆది ఆరాజ్యపుశాసనములను యెట్టి న్యాయముతో యెంత నిష్పక్షపాతముతో అమలుపరచునో దానినిబట్టియుండును. ఈపైయుద్దేశ్యమునసాధించవలయునన్న దానికి తగిన న్యాయవిచారణాధికారులుండవలెను. శాసనములను ప్రజల హృదయములందు విశ్వాసమునుకలిగించునట్లు అమలు పరచవలెను.

రాజ్యములోనుండు అన్ని తెగలవారలకును లేనిపోని భేదములు పెట్టకుండ న్యాయ విచారణ శాఖయందు ఉద్యోగపదవుల నిచ్చిననేగాని యిదిసాధ్యపడదు. ఈసందర్భమున సంస్థాన జనసంఖ్యలో నూటికి 85 మంది హిందువులే ననియు, న్యాయస్థానముల కక్షివారిలో యెక్కువమంది హిందువులేననియు, హిందూశాసనములో క్లిష్టసమస్యలు ఉదయించుచుండుననియు సూచించదగిన విషయము.

హిందూలా (ఖానూను) అంతయు గ్రంథగతము కాలేదు. అందులో చాల భాగము ఆచారముపై ఆధారపడి యున్నది. ఆ ఆచారములు వివిధ రాష్ట్రములలో, వివిధ తెగలలో వివిధములైయున్నవి. ఆచారములను బట్టి వ్యవహారములను పరిష్కారము చేయవలసి వచ్చినప్పుడు న్యాయవిచారణాధికారులకు న్యాయమునకై వచ్చువారల మనస్తత్వము, అలవాట్లు, భావములు తెలిసియుండవలెను. వ్యవహారమునకుచెందిన పార్టీలు యేతెగకు చెందియుందురో న్యాయవిచారణాధికారులును ఆదేతెగకు చెంది యున్నప్పుడే యిది సాధ్యమగును. కొన్ని సందర్భములందు హిందువుల కర్మకాండకు సంబంధించిన వ్యవహారములు విచారించవచ్చును. న్యాయ విచారణాధికారికి ఆ కర్మకాండను గురించి ప్రత్యక్షజ్ఞానము లేనంతకాలము, యెదుటనుండు సాక్ష్యము అతనికి సంపూర్ణముగ అర్థముకాదు. అందువలన సరియైన న్యాయము లభించదు.

హిందూ ధర్మశాస్త్ర మూలగ్రంథముల అర్థము ను నిర్ణయించుటకు సంస్కృతము తెలిసి, హిందువుల ఆచార వ్యవహారములను స్వయముగా యెఱిగియున్నవారే అర్హులను మాటను యెవరును నిరాకరించజాలరు.

మరియు న్యాయస్థానమునకు వచ్చిన వారలిచ్చు సాక్ష్యములను వాఙ్మూలములను సరిగా అర్థము చేసికొనుటకు జనులమాతృభాష సరిగా తెలిసి యుండవలెను. ఈ జ్ఞానము లేకున్నచో న్యాయాధికారి యితరులు చేయు తర్జుమాలో తృప్తిపడి యుండవలెను.

ఈసందర్భమున బ్రిటిషు యిండియాలోనున్న ఆచారమును తెలియఁబరచుట మంచిదని తలచెదము, అక్కడ మున్సిపు కోర్టులలోను, సబార్డినేట్ జడ్జీల కోర్టులలోను రికార్డులన్నియు ఆయారాష్ట్రముల మాతృభాషలలోనే యుంచఁబడుచున్నవి. కొన్ని కేసులలో జిల్లాజడ్జి యింగ్లీషుభాషలో సాక్ష్యపు వాఙ్మూలముల సంగ్రహమును వ్రాసికొనును. కాఁబట్టి ఆదేవిధముగ యీనిజాంగారి రాష్ట్రములోను రికార్డుల నన్నిటిని ఆయాజిల్లాలందలి మాతృభాషలలో నుంచవలయును.

ఇప్పటివలెలోనుండు నిబంధనల ప్రకారము న్యాయ విచారణాధికారులు యీ రాష్ట్రమందలి తెలుఁగు, మరాఠీ, కన్నడము అను మాతృభాషలతో మంచి పరిచయము గలిగియుండవలెను. నిర్బంధము విధించఁబడినను, ఆనియమము కఠినముగా అమలునందుంచఁబడుటలేదు. ఏలనవగా నేర్చుకొన బడినంతే చాలదు, అంతకంటె యెక్కువ పరిచయము అవసరమైయున్నది. అందుచేత నూటికి 10మందియైనను న్యాయవిచారణాధికారులు సాక్షులు వారి మాతృభాషలలోనిచ్చు వాఙ్మూలములను అర్థము చేసికొనజాలకున్నారు. ఇక సాక్షులు చెప్పు మాటల నట్టే వ్రాసికొనుట చెప్పనలెనా? సంస్థానములో అన్ని తెగల నుండి సంస్థా మాతృభాషలలో నొకటి తమ మాతృభాషగా గలవారిని సమర్థులను యేరి నియోజించుచో యీలోపము పోవునని విజ్ఞప్తికర్తలు తలచుచున్నారు.

ఈవిజ్ఞప్తిని సమర్పించుటయందు ముద్దేశ్యము న్యాయవిచారణ శాఖకు చాల గొప్ప కీర్తి దెచ్చుటయే.

—

# హైదాౖబాదు నాట్య కళోపాసక సంఘము

"దివ్య నాటక సమ్మేళనము"

(స. సం.)

గత గురువారమునాడు సాయంకాలము సుల్తానుబజారు వెస్లీమిషన్ చర్చి (క్రిస్తవులగుడి) హాలులో హైదరాబాదు నాట్య కళోపాసక సంఘమువారు దివ్యమైన నాటక సమ్మేళనము జరిపిరి. ఈ ప్రకారముగ ఆ సంఘమువారు హైదరాబాదునందు నాట్యకళను అభివృద్ధి నొందించుటకు ప్రయత్నించుచుండుట సంతోషించదగిన విషయము.

అయితే ౬-౪ గంటలకు ప్రారంభమగునని ప్రకటింపబడిన కార్యక్రమము తర్వాత సుమారొకగంట కాలమువరకు గూడ ఆరంభించబడకపోవుటవలన ప్రేక్షకులకు అసౌకర్య మేర్పడెను. అందుచే ఆనాట్య కళోపాసక సంఘపక్షమున ప్రేక్షక మహాశయులను క్షమించవలెనను విజ్ఞప్తి తప్పలేదు. ఆ సంఘమునకు సరియైన కాలమున పని ప్రారంభించుటకు ఆటంకములు లేకుండెనని మేమనము. కాని, నాట్యకళయొక్క సుస్పష్టమగు ఉద్దేశ్యము ప్రేక్షకులకు ఆనందము సమకూర్చుటయే యగుచో, ముందుగ చెప్పినకాలమునకు ప్రారంభించి, చెప్పినకాలమునకే ముగించుట ఆనందమునకు తోడ్పడు ఉపకరణములలో నొకటియగుచో,—తక్కిన అంశము లన్నిటికంటె ముందు సరియైన ముహూర్తమునకు పని ప్రారంభమగునట్లు సర్వవిధముల శ్రద్ధవహించుట చాల ముఖ్యము. కాలము నుపేక్షించుటచే నెరవేరని ఉద్దేశ్యములకు ఉదాహరణము లెన్నియో గలవు. కాలముయొక్క విలువయెడ తగిన శ్రద్ధవహించు నలవాటులేని మన హైదరాబాదులో సంఘములును సంస్థలును ఆ అలవాటును వ్యాపింపజేయుటకు సర్వ ప్రయత్నములు చేయుట వాటి ప్రతిష్ఠను పెంపొందించును.

ఇంకొక లోపము అనుకొనిన కార్యక్రమము అనుకొనిన ప్రకారము జరుగకపోవుట. యముని వేషమునకూడ అభినయించునని చెప్పబడిన విశ్వేశ్వరరావుగారు యముడైవచ్చి ప్రేక్షకులను భయపెట్టలేదు. శ్రీ. డి. వి.ఎల్ నరసింహారావుగారు మాత్రము ప్రకటింపబడిన ప్రకారము రామదాసు చాణక్య పాత్రలను రెంటిని ధరించిచూపిరి. పిచ్చివాని వేషము ధరించునని చెప్పబడిన రంగారావుగారు రామదాసులో నుడి పూజారిగ వచ్చిపోయిరి. కుటుంబరావుగారి దుర్యోధనుని గదియేమయ్యెనో తెలియుటలేదు.

మొదట రామదాసు నాటక భాగము ప్రయోగింపబడెను. నా అభిప్రాయమున భక్తిరస ప్రధానములగు నాటకములచే ప్రేక్షకులలో రసానుభవము కలిగించుట చాల కష్టమైన పని. భగవంతునియందు భక్తిని నటించుటయు, నటించి భక్తుల హృదయమందు భక్తిని ఉద్రేకింపజేయుటయు అసాధారణ ప్రజ్ఞకే సాధ్యములని తుదకు నాకు తోచినది. రామదాసు పాత్రధారుని భక్త్యభినయము నన్నాకర్షించలేదు. ఇదివరలో హైదరాబాదునందు కొన్ని సారులు శ్రీయుత విశ్వేశ్వరరావుగారు రామదాసు అయినప్పుడు కనపడినంత రసపోషణ యిపుడు కనపడలేదు. రామదాసు పాత్రధారుని చాణక్యవేషము యెక్కువ రసపోషకముగ నుండినది. ఈపాత్రధారుని ఒకనేర్పు యేమనగా వేషము మార్చినపుడు వేరొక క్రొత్తవ్యక్తి ఆ వేషమును ధరించిరను భ్రమకలిగించుట. ఇంకొక నేర్పుయేమనగా, ఒకడే రెండు పాత్రల పనులను నిర్వహించుటయందు కంఠస్వరపు మార్పుచే తెరచాటునుండి యెవడో రెండవవ్యక్తి పలుకుచున్నాడను అభిప్రాయము గలిగించుట. కాని యీ మానోఆక్టింగ అనుదానిలో స్వరపు మార్పుతో తృప్తిజెంది, అభినయమును మార్చకున్నచో రసపోషణ సరిగా జరుగునని నా అభిప్రాయము. అభినయము దృశ్యమగుటచేతను, అదృశ్యమైన కరచరణాది చలనము మార్పులేని ఒకపూర్వ స్వీకృతవేషమందే కన్పించుటచేతను, మాటిని ఆ ఆకారమునకును మారిన యీ అభినయములకును పొసగుకరక రసము చెడును. డి. వి. యల్. నరసింహారావుగారు ప్రదర్శించిన యింకొక అంశమేమనగా నాటక రంగస్థలమును నాటకచేక్కి వేదికగా మార్చక పద్యములు, పాటలు వచ్చినపుడు కడపటి ఆలాపానంబకమును విసర్జించుట. వారి కంఠమాధుర్యము మెచ్చుకొనదగినది. శాంతి, భక్తిరసములలోకన్న రౌద్ర; భీభత్సరసములందు వారెక్కువ [illegible].

కె. వి. రంగారావుగారు వైష్ణవ పూజారివేషము ధరించినప్పు, ప్రేక్షకులనుండి ఆసలు మూలసంధానమనుచు మూకముగ పోవుచున్నాడను అనుమానము కలిగించిరిగాని, నేటి సనాతన మత పరాయణులగు మూఢులైన పూజారులను తమ అభినయములో చాల నేర్పుగా నే, తన ముచేసిరి. కడపట కబీరుయొక్క భక్తి ప్రభావముచే మాయమైన విగ్రహము మరల వచ్చుటగాంచి హిందువుడైనను ముసల్మానుడైనను భక్తిగలవాడే భగవత్ప్రియుడని నమ్మి, యీ కాలమున కబీరువలె పరమతమందు గొప్ప విషయములను గహనములో జూచునాయకులు లేనందువల్లనే హిందూ ముసల్మానుల సంఘర్షణలు జరుగుచున్నవని పాతము చెప్పుటయు చమత్కారముగ నుండెను. ఈపాతము చెప్పునపుడు మొదట భగవద్భక్తుడగు కబీరును దూషించినందుకు కలిగిన హృదయపూర్వక పశ్చాత్తాపము వెలిబుచ్చబడక, అడియు ఒక హేళనా పద్ధతిలో నుండుట రసభంజకము.

విశ్వేశ్వరరావుగారి కబీరులో ఒక్కసారిగా స్వచ్ఛమైన హిందూస్థాని భాషనుండి స్వచ్ఛమైన తెలుగుకు దూకు లక్షణము చాల విచిత్రముగ దోచినది. బహుశా యిది మూలగ్రంథ లోపమైనచో నటునిది తప్పులేదు. అయినను మొత్తముమీద విశ్వేశ్వరరావుగారు జైలులోనుండు రామదాసు వేషమునకు అర్హుడైనంత కబీరువేషమునకు అర్హుడుగ లేనట్లు స్పష్టమైనది. వారిసంగీతమునకు స్థానం నరసింహారావుగా రిచ్చినసనదు చాల అద్భుతముగా చెల్లుబడి యగుచుండుట తృప్తికరము.

నాట్య కళోపాసకసంఘము వారేర్పరచు నాటక సమ్మేళన సందర్భములందు టిక్కెట్ల వలన నటులకు సామర్థ్యానుసారము సన్మానమొసంగి ప్రోత్సాహమిచ్చుటకు చాలినంత జమయగుచో, నాట్యకళ సినిమా టాకీలతో పోటీచేయుచు పోషించుట సాధ్యమగును. నాట్య కళోపాసక సంఘమువారు దీనిని యెక్కువదృష్టియందుంచుకొన వచ్చును.

* * * *

గత శుక్రవారమునాడు రాత్రి సుమారు ౮ గంటలనుండి క్రొత్త నాంపల్లిలో డాక్టర్ వి. వి. శ్రీ హరిగారి యింటిలో శ్రీయుత డి. వి. యల్. నరసింహారావుగారు శ్రీకృష్ణవేషమును, బొబ్బిలి నాటకమందలి రంగారాయ వేషమును, చాణక్య వేషమును, రామదాసు వేషమును ధరించి అక్కడ కూడినవలుగురు పెద్దలకును ఆనందము గావించిరి. వేషము మార్చినప్పుడెల్ల అన్యులు ఆయా పాత్రలధరించి వచ్చినారనిపింప జేయగలిగిరి. భీభత్స రసపూరితుడగు చాణక్యుని అనుకరించినపుడు ఒక చిన్న బాలుడును, రౌద్రమూర్తి రంగారాయుని అనుకరించునపుడొక బాలికయు బెదరుకొని వంత జూచుటకై ముందు కూర్చుండినవారు లేచిదూరముగా వెనుకనున్న తమ తల్లులను గూడ దాటిపోవుట తమాషాగా నుండెను.

---

## గణపత్యుత్సవమున ప్రభుత్వాధికారులు పాల్గొనుట

గణపత్యుత్సవ సందర్భములో ౨ వ ఆబాను వాడు సభ సమావేశమైనది. అధ్యక్షులు మౌ. సయ్యదు మొహియుద్దీను సాహెబ్ ప్రిన్సిపాలు. ఉస్మానియా కాలేజి. చాలమంది వచ్చియుండిరి. గొప్పగొప్ప అధికారులందరు సభనలంకరించిరి. వకీళ్లుకూడ వచ్చియుండిరి. హిందువులు, ముస్లిములు కలిసి మొత్తము వేయిమందియుండిరి. నిలుచుండుటకు చోటులేకుండ స్థలము క్రిక్కిరిసియుండెను.

సాయం: ౬-౹౹ గంటలవేళ కాలేజి ఉపాధ్యాయుడు విద్యావిషయమున గంభీరముగ ఉపన్యసించెను. ప్రపంచములోని వివిధదేశముల వారు వివిధకళల నెట్లు పూర్వకాలమున అస్తిత్వమునకు దెచ్చిరో వివరించెను. ఇజిప్టువారుగా జావస్తుపులను, చాల్డియనులు జ్యోతిశ్శాస్త్రమును, అసీరియనులు గృహనిర్మాణ శిల్పమును, ఫొనీషియనులు అక్షర కల్పనమును, మహమ్మదీయులు సంఘశాస్త్రము, రాజకీయశాస్త్రము, పరమత సహనమును నెలకొల్పిరి. హిందువులు సర్వతోముఖలతో లచుట, రాతిని చెక్కుట, వైద్యశాస్త్రము, రేఖాగణితము, రసాయన శాస్త్రము ను ప్రపంచమునకు నెచ్చిరి. చైనావారు కాగితపు కిరమను సృష్టించిరి......నేడు వారి విద్యాభివృద్ధి అధునికకాలమున జరిగిన చరిత్ర మును వివరించి ఈ యన్నిటికంటె మ. ఘ. వ. మన ప్రభువు గారి కాలమున సృష్టించబడిన విద్యావిధానము అత్యంతోపకారకమనియు, శతాబ్దములనుండి వీరికాలమున చేసిన పనులను ప్రజలనుసరించుటకు వీలు లేదనియు, పాశ్చాత్య భాషలలో విద్య నేర్చుపద్ధతిలోగల కష్టములు గమనించి మాతృభాషలో విద్య నేర్పు ఉదారపద్ధతిని నెలకొల్పిరని వివరించిరి.

మౌ. గులాం మహమ్మదుఖాను అధ్యక్షుల తాలూకదారుగారు, ఆ దేవిషయమున మాట్లాడుచు స్త్రీవిద్యనుగురించి గంభీరోపన్యాసము నొసంగుచు స్త్రీలకు పరాపద్ధతి తొలగించిన నేగాని పురుషులతో సమానముగ ముందునకు వచ్చి జీవితసంగ్రామమున వారును పాల్గొనిన గాని - స్త్రీల విషయమున పురుషులు సమానత్వము వర్తనము చూపిన గాని ఏదేశము వృద్ధిగాంచలేదనియు సెలవిచ్చి, టర్కీ, ఇరాను దేశముల ఈ కాలపు అభివృద్ధికిని కర్మనముగ జూపిరి. తరువాత తాలీమాతు సదరు మొహతమిము గారు ప్రస్తుతవిద్యాపద్ధతిలో గల లోపములను చూపుచు, బాలబాలికల చిత్తవృత్తికి అనుగుణ్యమైన విద్య నేర్పవలయునని చూపిరి.

రాత్రి 9 గంటలకు కృతజ్ఞతతో సభముగిసెను. గొప్పవారు పుష్పమాలాలంకృతులైరి.

—రహీందుదర్కాన్.

## వకీళ్లసమావేశము

బారిష్టరు, ఎల్ ఎల్. బి. లో కడతేరినవారిని మాత్రమే యికముందు న్యాయాధిపతులుగా ఏర్పరుపవలయునన్న నియమము. నాక్షేపించుచు అవ్వలుదర్జావకీళ్ళు ౯ ఆబాను నాడు సభ చేసిరి. ఇట్టిసభయే నిజామాబాదులోకూడ ఇటీవలనే జరిగినది.

## ప్లేగువ్యాధి ఉన్న చోట్లు

ఈ క్రిందిపేరులలో ప్లేగు వ్యాపించినట్లు ప్రకటింపబడినది. [1] షైరతాబాదు [2] చేనూవయా ఖాతుపురము.

### మోటారు ప్రమాదము

మామిడిపల్లి చెరువువద్ద ఒకసైకిలు మోటారుకు తాకినందున సైకిలుసవారు చనిపోయెను.

### రాకపోకలు

డాక్టరు నసరుల్లాఖాన్ సదరుమహాసబు గారు ఢిల్లీకి వెళ్లిరి.

### మద్రాసు ప్రత్యేక శాఖాల విద్యార్థులరాక

ఆ శాఖాల విద్యార్థులు సుమారు 50 మంది అటలపోటికై నగరమునకు వచ్చిరి.

### ఫారసీ కవులు

మన ప్రభువుగారి పాలనా కాలములో ఫారసీ భాషయందు కవిత్వము రచించినవారి పేర్లనుచు నొక ప్రత్యేక వ్యాసము ఉస్మానియా విశ్వవిద్యాలయ పత్రికలో ప్రకటింతురట. అట్టి కవులు తమ యుదంతమును ఆబాను నెల చివరకు వ్రాసి పత్రికాధిపతులకు పంపవలయునట!

### ఉస్మానియా వైద్యశాల

దీనికి సంవత్సరపుఖర్చు 8 లక్షల రూపాయలు దీనిలో రోగుల ఆహారముకొరకు దాదాపు 80 వేలరూపాయలనియు, విద్యుత్తు (బిజలీ) ఖర్చు 38 వేలరూపాయలనియు తెలియుచున్నది.

### నగరాభివృద్ధి సంఘము

ఈసంఘములో కర్నలు నవాబు సుల్తాను యార్జంగు బహదరు (సీనియరు నాయబుకోత్వాలుబల్దా) సభ్యులుగా నియమింపబడినారు.

### విరాళము

రజతోత్సవ స్మారక భవననిర్మాణమునకై నవాబ్ అక్బరలీఖాన్ బారిస్టరుగారు నూరు రూపాయలు సమర్పించిరి.

మొదటిపేజీ తరువాయి

నుంచి యీ కార్యము జరుగుటలేదు కోట్టి ముఖ్యముపై ఏయుద్దేశ్యముతో నీయుద్యమము ప్రారంభించబడియెనో యది నిష్ఫలితమని విమర్శించుట సాహసము కాదు. ముందెటుల జరుగునో మన మూహింపజాలము

బోధనాభ్యాసన కళాశాలయొకటి, ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు సంబంధించియున్నది బి. ఏ. యుత్తీర్ణులైనవారు డిప్ ఇడి పరీక్షకు వెళ్లవచ్చును. బోధనా పద్ధతికై పదివిషయాలు (సబ్జెక్టులు) నియమితములు. తెలుగందులోనొకటి. కాని ఇదినామమాత్రము. ఇదివరకు తెలుగు బోధనాపద్ధతి నభ్యసించినవారు లేరు. కళాశాలయందు దీనికొఱకై యేర్పాటులుకూడలేవు. బోధనాపద్ధతి సైన్సు, చరిత్ర, ఉర్దూ మున్నగువాని గుఱించి నేర్పినచో చాలదు. తెలుగువిషయము సయితము పద్ధతి నేర్పబడవలెను. తెలుగు ఏర్పాటు గావించి యాంధ్రుల ప్రోత్సహించుట సమంజసము.

## స్త్రీలు—విశ్వవిద్యాలయము:—

ఇంతవరకు వివరించిన విషయములు పురుషులగుఱించినవి. ఆంధ్ర స్త్రీలకు ఉస్మానియా విశ్వవిద్యాలయమం దున్నస్థాన మత్యంతయల్పము. మాధ్యమిక ఉన్నత పాఠశాలలందును వారికి స్థానములేదు. కేవలము ప్రాథమికవిద్యయే వారికి యున్నతవిద్యయైనది. అటుతర్వాత నాయ మాతృభాషా ద్వారా విద్యగడించు యేర్పాటులు లేవు. ఉర్దూద్వారా విద్య నేర్చుట పురుషులకే యనుకూలముగా యుండనప్పుడు స్త్రీలగుఱించి వేరుగ చెప్పనేల? ఆంధ్ర స్త్రీలలో విద్యావతులసంఖ్య తక్కువ యుండుటకు కారణములలోకెల్ల నిది ముఖ్యము. వారికి యాంధ్రబాలికల యున్నత పాఠశాలయే కరణ్యము. ఆపాఠశాలయే లేకయున్న నేటి యాంధ్రబాలికల విద్యాస్థితి పరిహాసాస్పదమై యుండెడిది.

మనప్రభుత్వము యమిత ధన వ్యయమునకోర్చి విద్యాభివృద్ధికి యత్నించుచున్నను, ఇచ్చటి ప్రజలలో అధిక సంఖ్యాకులకు వారి మాతృభాషాభివృద్ధికై తగుయేర్పాటులు గావింపబడలేదని చెప్పుట సత్యదూరము కాదు. ప్రజలలో కూడా భాషాభిమాన మంతగా యున్నట్లు గోచరించదు. మనరాష్ట్రమున నేటి ఆంధ్రభాషయొక్క విచారకరదుస్థితి వీనియన్నింటి ఫలితము. ప్రభుత్వమువారును ప్రజలును దయేకీభవించి భాషాభ్యుదయమునకై పాటుపడిన చిరకాలములోనే పరిస్థితులు చక్కబడును. అభిమానము శ్రద్ధ ముఖ్యము. భాషాభిమాన లీవిషయము గమనించిన నైజాంరాష్ట్ర ప్రథమాతనోము ఫలించును.

—



(౧౦ వ పేజీ తరువాయి)

మును నూరని ఇతిహాసకారులు గ్రహించిరి వసుశబ్దమునందు మాత్రము దేవశబ్దము చేర్చిరి అంతేగాక కర్ణార్జున యుద్ధ సమయమునందు కర్ణునకు కృష్ణుడు అస్త్రముచూపి మఱపించినట్లు ఒక మంత్రములో స్పష్టముగా నున్నది పైకారణములవట్టి కృష్ణార్జున కర్ణులని నామాంతరములుగల వైకుంఠ కృత్స శుష్ణులు, భారత ప్రసిద్ధ కృష్ణార్జున కర్ణులని మనము నిశ్చయింపవచ్చును. భారతకారుడు వేదోక్త నామములలో నుండి అనువ్వరి చారిత్రక పురుషుల కృష్ణార్జున కర్ణనామములు గ్రహించి కృత్సశుష్ణాదినామముల నుద్దేశపూర్వకము గా విడిచిపెట్టిన వాడయ్యెను. వైదికేతి హాసమును కొంత గుప్తభాషలో వ్రాయుట అతని యుద్దేశము. అట్లువ్రాయునప్పుడు స్వాభిప్రాయాను గుణముగా పాత్రపోషణము చేయుచు కథను కొంత మార్చి వ్రాయుట కతని కవకాశముచిక్కెను వేదములో కృష్ణుడు ఇంద్రావతార మనియున్నది. భారతములో విష్ణ్వవతారమని యున్నది. ఈ భేదమునకు కారణమేమనగా వేదములో వర్ణింపబడిన విశ్వాశ్వత్థమగు మహేంద్రుని భాగవత మతస్థులు విష్ణువుగా గ్రహించుటయే. అర్వాచీన వాఙ్మయములో నింద్రుడు వేదోక్త సార్వభౌమ స్థానమునుండి చ్యుతుడయి సామాన్య పర్జన్య దేవతగా మారినాడు. పర్జన్యుడు మహేంద్రునియొక్క విభూతియేగాని పర్జన్యుడు మాత్రమే మహేంద్రుడు గాడు. వేదోక్త విష్ణునామము యజ్ఞపరము. భాగవతుల విష్ణువు సర్వేశ్వరుడు. యజ్ఞమువిని విభూతి. ఈ యభిప్రాయ భేదమే పై భేదమునకు గారణము.

శృత్రుసకు అంబరీష, భయమాన, ఋజ్రాశ్వ (వృష్ణ),సురాధస్, సహదేవ అను పేరులుగల ఐయిదుగురు పుత్రులున్నట్లు ఋగ్వేదములో స్పష్టోదాహరణమున్నది. వీరిలో జ్యేష్ఠునకంబరీషునకు శము, వృషభ, అజాతశత్రు నామాంతరములుగగూడనున్నవి. ఇతడే భారతప్రసిద్ధ ధర్మరాజు. శముడనశాంతిపరుడు. వృషభుడన ధర్మస్వరూపుడు. భారతకారుడు. అంబరీషనామము ఉద్దేశపూర్వకము గావిడిచి వృషభశబ్దార్థమగు ధర్మరాజు నామమును అజాతశత్రు నామమును మాత్రము గ్రహించెను. పురాణప్రసిద్ధమైన అంబరీషుని నామాంతరమైన నాభాగశబ్దమును ధర్మరాజవాచకముగానే యుండవలెను. ఆ భాగుడనగా భయములేనివాడు. నాభాగుడన భయముకలవాడు. ఇదినాయూహ. వేదములో దీనికిమాత్రము ప్రత్యేకప్రమాణము లేదు. భయమానశబ్దమునకర్థము తెలిపెదను — అనగా భయపెట్టువాడనియర్థము. భారతమునందలి భీమశబ్దము దీనిసమానార్థకము. సురాధస్యే నకులుడు, సహదేవుడు స్వనామముచేతనే వేదమునందు శ్లేషింపబడువాడు పంచప్రాణదేవతలగు మరుత్తులే యీయైదుగురుగా నవతరించినట్లు స్పష్టముగానున్నది ధర్మరాజు ఉదానావతారము ఉదానము తేజోమయము. ఉత్క్రాంతిహేతువు అందువలన ధర్మరాజు యమావతారముగా పరిగణింపబడినాడు భీముడు వ్యానావతారము వ్యానమే సర్వకర్మలను జేయించు శారీరవాయువు అర్జునుడు ప్రాణావతారము. ఉపనిషత్తులలో ప్రాణమింద్రవిభూతిగా చెప్పబడినందున అర్జునుడు ఇంద్రావతారముగా చెప్పబడినాడు నకులసహదేవులు సమానాపానావతారులు. సమానాపానములే దేవవైద్యులు నకులనిశ్వాసలకు జరణశక్తి నిర్మలత్వము ఇవియే అండజుకు ఆరోగ్యకారకములుగదా! సమానవాయు వితరవాయువులలో సంమిశ్రమగుటవలన నకుల నామముదానికివ్వబడినది (నకులమునకు అని నకుల తెలియదగిన యితరవస్తువులతో కలిసియుండుటవలన) వేదోక్త సురాధస్యనామము మంచి మనస్సుగలవాడను అర్థమునందు ప్రవర్తించుచున్నది అదికూడ సమానవాయువునకే చెప్పినను, ప్రధాన ప్రాణవాయువుతోకలిసి సదా సంచరించుటవలననే ఆ పానమునకు సహదేవనామము కలిగినది ప్రాణమే దేవుడు. అపానమే సహదేవుడు ఈ మరుత్తులు మనుష్యులుగాబుట్టినను వీరినిస్తుంచినవారికి అమృతత్వము సిద్ధించునని ఒక మంత్రములో స్పష్టముగానున్నది. అందువల్ల భారతచరిత్రము పావనము

ఈపాండవులతల్లి కృష్ణియనునామములో వేదమున వ్యవహరింపబడినది. కృష్ణియన భూమియని యర్థము ఆమె భూమియవతారము. పృథాశబ్దము పృథివీ పృథ్వీశబ్దసమానార్థకము పాండవుల భార్యద్రౌపది కేవలము నఘోషయను పేరుతో వ్యవహరింపబడుచున్నది ఈమె అశ్విని దేవతల యనుగ్రహమువలన అర్జునుని పొందెనని ఒక మంత్రములో స్పష్టముగానుల్లేఖింపబడియున్నది. మరియెండుమంత్రములలో మరుత్తులేవ్వరును ప్రజావంశసురాలగు నీమెను తమవద్దకు పైకూర్చుండబెట్టుకొని తీసికొనివెళ్ళినట్లును తమకర్మలలో నామెను భాగస్వామినిగా చేసినట్లు ఉన్నది. ఇదియే ద్రౌపది. పాండవులైదుగురకు నొక్క భార్యయైనదనుటకు ప్రమాణమయ్యెను. వైదిక కాలములో నొకరకము నెక్కుట వనగా అతనివత్ని యగుటయనియే లేదు. ఈ ఘోష, కక్షీవతునకయని చెప్పబడినది. కక్షీవతుని యనగా కురుగబోసికొనిన గొప్పపుట్టుగలది. ఇదిగూడ ఆఘోషయే ద్రౌపదియని నిశ్చయింపుటకాధారమగుచున్నది. ఈమె కక్షవంతుని కుమారిత. కక్షవంతుడు ప్రజావంశజుడు. అతనికి విపథియని నామాంతరముగలదు. విపథయనగ కర్మనుడు. ఇది యాజ్ఞసేన శబ్ద సమానార్థకము.

కుయవ, నయవాక్, వృద్ధవాక్, దుర్యోణ అనునామములుగల ఒక గొప్పశత్రుని కుత్సుడు జయించినట్లు ఋగ్వేదములో స్పష్టముగానున్నది. ఈకుయవుడే దుర్యోధనుడు. అతని దుర్యోణనామమే దుర్యోధన నామముగా మారినది. కుయవకుయవాక్శబ్దములు. కుత్సితముగా మాట్లాడువాడని యర్థము. సుయవాక్ యని శాస్త్ర్యము. కురుశబ్దముకూడ నిదే యర్థమిచ్చును. (కుత్సితం రౌతీతి కురుః అని వ్యుత్పత్తి) పాండవులని పాండవులను ప్రత్యేకము గావ్యవహరించుట ధృతరాష్ట్రపుత్రుల కురునామము వంశత్వము గాక గుణత్వమని బోధించుచున్నది. వీరిపూర్వ పురుషుడు కురువైయుండుట ఈ నిర్వచనమునకు ప్రతిబంధకముగాదు.

ఇంద్రావతారపురుషుడు తనస్నేహితులగు శృత్రపుత్రులద్వారా క్షేత్రమును సాధింపజేసినట్లు ఒకమంత్రములో స్పష్టముగానున్నది. కృష్ణునియొక్క ఇంద్రప్రస్థనగరంలోనే నీ సాహాయ్యమువల్ల శత్రువులచే నాక్రమింపబడిన మహాయంత్రమును వేము జయించుముగాక అని కలదు అందువలన నరుపొందిన యంగమునకు గారణము రాజ్యభాగ సంగ్రహమని స్పష్టము.

దుర్యోధనాములతల్లి వర్చ్య అని వేదములో చెప్పబడుచున్నది. ఈ వర్చ్య ఒక్కసారియే ఇరువదివందల కుమారుల గనినట్లు లెండు మూట్లుపైకలదు. భారతములోగూడ కర్ణపర్వాదిని గణించిన నిలిచిన పేరులపట్టికనిచ్చుసందర్భమున, ధార్తరాష్ట్రులలో గణించినవారు తొమ్మండ్రు, నిలిచినవారుపదునొకండ్రు లెక్కచేయబడిరి. ఇదిమూల భారతవాక్యముగానుండవచ్చు. ఈ వర్చ్యపుత్రులలో ముఖ్యుడు అనువాదకుడున్నట్లు వేదమువలన తెలియుచున్నది. వానికే భారతములో దుశ్శాసనుడు అనిపేరు. పాండవపక్షపాతియగు తపమువనుఋషి ఈ వర్చ్య పుత్రులచే వధింపబడినవిషయము అతనియొక్క సూక్తములో స్పష్టముగా వర్ణింపబడినది. వత్సుని ఒకసూక్తములోగూడ, వర్చ్యపుత్రులు తన్నుమాటిలో త్రోసినట్లు కాపబడితుమై యతడు దేవతలప్రార్థించుసందర్భమున చెప్పబడి యున్నది.

దుర్యోధనుడు తుదయుద్ధమున పారిపోయి నీటదాగినట్లు స్పష్టముగా చెప్పబడియున్నది. పాండవులు కృష్ణానుగ్రహముచే అనీతిని సాధించి వానిని సంహరించిరట.

ఈమహాభారతయుద్ధము హస్తా నక్షత్రమునందు రవియుండగా దక్షిణాయనప్రవేశకాలమందు (అనగా నిప్పటికి 6500 వత్సరములకు పూర్వము) జరిగినట్లు కుత్సు రెండుమంత్రముల వల్ల తెలియుచున్నది.

—

